ఇ. చరూషిన్

# జంతు ప్రపంచం

అనువాదం: ఆర్వియార్ చిత్రాలు: ఎన్. చరూషిన్

 "రాదుగ" ప్రచురణాలయం
మాస్కో

 విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్



# ఉష్ణదేశాల్లో చలిదేశాల్లో వుండే జంతువులు





# సింహం

జీబ్రాల్లారా, చారలచారల జంతువులారా జాగ్రత్తుస్మా! జింకల్లారా, పరిగెత్తండి! దున్నల్లారా, భద్రం!

సింహం వేటకి వస్తోంది.

గర్జాఘోషలా సింహ నాదం అడివి తుప్పలమీద, పొదలమీద తరంగిస్తూ పోతోంది. అన్ని జంతువులూ యెక్కడెక్కడ దాంకుని ప్రాణ రక్షణ చేసుకోవాలో చోట్లు చూసుకుంటున్నాయి.

జంతు రాజ్యానికి అధిపతి సింహమే. మహా బలమైంది, భయకారకమైంది. సింహం పంజాలు, సింహం కోరలు మహా వాడిగా వుంటాయి.

యీ సారి, పాపం, సింహానికి బలయ్యే దెవరో మరి?



# పెంగ్విన్ పక్షులు

పెంగ్విన్ పక్షులు యితర రకాల పక్షులలాంటివి కావు. అవి గాలిలో యెగరవు, నీళ్లమీద యీదతాయి. అవి నీళ్లల్లోకి మునిగి రెక్కల్ని చాలా గట్టిగా కొట్టుకుంటాయి. దాంతో అవి చేపలకంటే వేగంగా ముందుకు పోతాయి. నేలమీద అవి బలే నవ్వొచ్చేటట్టు నడుస్తాయి. నిటారుగా నుంచుని నడుస్తాయి. దూరంనుంచి చూస్తే వెనక్కాల జీరాడే బారు నల్ల కోట్లు, తెల్లని వెయిస్ట్ కోట్లు తొడుక్కున్న ఘరానా మనుషులు నడుస్తున్నట్టుగా కనిపిస్తాయి.





ఓ సారి వో స్టీమర్ దూరదేశపు మంచు సముద్రంలో తప్పిపోయింది. కళాసీలకి దూరంలో తీరం కనిపించింది. స్టీమరు తీరం దగ్గరికి వచ్చే కొద్దీ మనుషులు బారులు తీరి వున్నట్టు వాళ్లకి అనిపించింది. స్టీమరు బాగా తీరం దగ్గరికి వచ్చే వేళకి చూస్తే యేముంది, ఆ మనుషులందరూ వొక్క పురుగు కూడా మిగలకుండా, నీళ్లల్లోకి దొర్లు కుంటూ పడిపోయేరు! అప్పుడు ఆ కళాసీలకి అర్థమైంది వాళ్లు మనుషులు కారు అని. అవి పెంగ్విన్లు!

# తిమింగిలం

ప్రపంచంలో కల్లా అతి పెద్ద జంతువు తిమింగిలం. యిది సముద్రంలో వుంటుంది. చేపలాగా యీదుతుంది.

చేపల గుంపులని వేటాడుతుంది. యీ వేటలో అది ఉత్తరాదికి, మంచు తప్ప యేమీ లేని చోటికి, లేదా దక్షిణాదికి యేటి పొడుగుతా వేడిగా వుండే చోటుకి పోతూ వుంటుంది.



నోటినిండా నీళ్లని నింపుకుంటుంది. ఆ నీళ్లల్లో చేపలు దండిగా వుండచ్చు. తన 'బలీన్' గుండా నీళ్లని వడగొట్టి చేపల్ని మిగిలించుకుని భోంచేస్తుంది. తిమింగిలం పై దవడకి కొమ్ముల్లాంటి బొమికెలు రెండు వరసలుగా వుంటాయి. వాటినే 'బలీన్' అంటారు. 'బలీన్' అంటే తిమింగిలం బొమెక అని అర్థం.



# ఏనుగు

ఏనుగు అడివి గుబురుల్లోనుంచి వచ్చి ఆరుబయట నుంచుంటే ఒక్క కొమ్మ ఫళకమనదు, ఒక్క ఆకు అల్లల్లాడదు.

బూడిద రంగు కొండలాగా నిశ్చలంగా నుంచుంటుంది. దాని కాళ్ళు చెట్టు బోదెల్లా వుంటాయి. దాని చెవులు చేటల్లా వుంటాయి. బలమైన దంతాలు వంపు తిరిగి, పొడుగ్గా వుంటాయి. తొండంతో వేళ్లతో సహా దుబ్బుల్ని పెకలించి వేస్తుంది. వాటిని నోట్లో కుక్కుకుని మెల్లిగా నములుతూ వుంటుంది.

ఏనుగు యెంత బలమైందంటే దానికి అడివిలో దేన్నీ చూసీ భయపడవలసిన అవసరం లేదు.





# కొండచిలువ

అడివిలో ఖాళీ జాగాలో యెంతో పాత కాలం నాటి చెట్టు వుంటుంది. దాని వేళ్ళ నేలలోనుంచి పైకి లేచి వస్తాయి. గుబురుగా పెరిగిన కొమ్మలు మెలికలు తిరిగి, అల్లిబిల్లిగా అల్లుకుపోయి వుంటాయి.

వొక కొమ్మ యించుమించు పాములాగా చెట్టు కాండానికి చుట్టుకు పోయి వుంటుంది. పాములాగా యేమిటి, నిజంగా అది పామే! భయంకరమైన కొండచిలువ!

పక్కనుంచి గెంతుకుంటూ పోయే వో లేడి, నేలమీద యెగురుకుంటూ పోయే వో చిన్న జంతువు, పక్క కొమ్మమీద వో క్షణం వాలే పిట్ట — అన్నీ కొండచిలువకి బలైపోతాయి. మొదటగా అది తనకి అంకిన దాన్ని చుట్టుకుని నుగ్గు చేస్తుంది. తర్వాత కబళిస్తుంది.



# కొక్కాటూ

కొక్కాటూ అడివిలో వో కొమ్మమీద కూర్చుంటుంది. తురాయితో ఆడుకుంటూ వుంటుంది. దాన్ని విసన కర్రని ముడిచినట్టూ, తెరిచినట్టూ ముడుస్తూ తెరుస్తూ వుంటుంది. అన్ని రకాల కంఠధ్వనులనీ శబ్దాలనీ అనుకరించడంలో దీని నేర్పు అమోఘం. హఠాత్తుగా అది పొదల్లో అడివి పందిలాగా గుర్రుమంటుంది. గుహలో వున్న జంతువులాగా గురగుర మంటుంది. చిలకలాగా యీల వేస్తుంది.

దీనికి రష్యన్ భాషని, ఫ్రెంచి భాషని యే యితర భాషనేనా గానీ నేర్పచ్చు. కాని తనేం మాట్లాడుతున్నదీ దానికి తెలియదనుకోండి.

పాటలు పాడ్డం నేర్చిన వో కొక్కాటూని నేను యెరుగుదును.



# హిప్పోపొటామస్

హిప్పోపొటామస్ కాళ్ళు పొట్టిగా, లావుగా వుంటాయి. అలాంటి కాళ్లతో అది సరిగా నడవను కూడా నడవలేదు. అది నడుస్తూ వుంటే దాని కొవ్వు వొళ్ళు వూగుతుంది. దీనికి యెంత ఆశ లావంటే మొత్తం పచ్చిక బీడుకి బీడునీ తినేస్తుంది. తను తినలేక పోయిందాన్ని తొక్కి తగలేస్తుంది. పొట్టనిండా తిన్నాక కునుకు తీద్దామని నది వొడ్డుకు పోతుంది. వెచ్చని నీటిలో — అది హంస తూలికాతల్పం అయినట్టు — హాయిగా ఆతప స్నానం చేస్తూ వుంటుంది. విశ్రాంతి తీసుకున్నాక ఆటలు మొదలెడుతుంది. నీళ్లల్లో వున్నప్పుడు యెడ్డిగా వుండనే వుండదు. యీతాలు కొడుతుంది, నాచు మొక్కల కోసం నీళ్లల్లో మునుగుతుంది. మధ్య మధ్య భోషాణం పెట్టె తెరిచినట్టుగా నోరు తెరిచి ఆవలిస్తుంది, వో రకం సకిలింపు చేస్తుంది. అలాంటి సకిలింపు చెయ్యడానికి పది గుర్రాలు కలవాలి.

# ఒరాంగ్‌టాంగ్

ఒరాంగ్‌టాంగ్ పెద్ద కోతి. దీనికి ముదురు జేగురు రంగు బొచ్చు వుంటుంది. మలే భాషలో ఒరాంగ్‌టాంగ్ అంటే 'అడివి మనిషి' అని అర్థం. దీని గురించి మలేయన్లకి వో కథ వుంది. ఒకానొకప్పుడు యిది మనిషేనట, వొక వూళ్లో వుండేదట. పని చెయ్యడం యిష్టం లేక అడివిలోకి వెళ్లిపోయి చెట్లమీద కాపరం పెట్టిందట. దాని వొళ్లంతా జేగురు రంగు బొచ్చు పెరిగిపోయి కోతి అయిపోయిందట.



# కోతులు

యివి కొంటె కోణంగి చిన్న జంతువులు. వీటికి ముడతలు పడిన చిన్న ముఖాలుంటాయి, ముదివగ్గు ముసలమ్మల ముఖాల్లా. వీటి నల్లని చిన్న చేతులు మనిషి చేతుల్లా వుంటాయి. వీటి కాళ్ళు కూడా మరో జత చేతుల్లాంటివే. కాని వేళ్లల్లాగా కాకుండా పొడుగాటి వేళ్ళు వుంటాయీ జత చేతులకి. యీ చేతులతో అవి బరుక్కుంటాయి. వస్తువుల్ని జవురుకుంటాయి, దెబ్బలాడతాయి. అవి రోజంతా అరుస్తూ, పోట్లాడుకుంటూ, వో కొమ్మమీదనుంచి వో కొమ్మమీదకి గెంతుతూ చెట్ల మీద తిరుగుతూనే వుంటాయి. కాయగూరల మళ్లని యెక్కడ ధ్వంసం చేస్తాయో అని రైతులు వీటిని చూసి భయపడి చస్తారు. హుషారుగా కిచకిచ లాడే యీ మూకకి తినడం యెంత సరదాయో, మొక్కల్ని పీకి చెల్లా చెదురుగా విసిరెయ్యడం కూడా అంతే సరదా.





# మొసలి

మెరకగా, వెచ్చగా వుండే నీళ్లల్లో యెండలో గడపడం అంటే మొసలికి యిష్టం. కదలకుండా మెదల కుండా పడుకుంటుంది. కోరల నోరు మూసేసుకుంటుంది. దీని తోక సగందాకా దువ్వెనలాంటి జీరతో వుంటుంది. యధాలాపంగా చూస్తే యిది నీళ్లల్లో నాని పోతూ వున్న చెట్టు మొద్దు అనుకుంటారు గాని బతికి వున్న జంతువు అనుకోరు.

అది భోజనం కోసం యెదురు చూస్తోంది. వో జీబ్రా గాని, వో జింక గాని నీటి దగ్గరికి రావాలి! అంతే! మొసలి గబగబా దాన్ని తోకతో కిందకి కూలగొట్టి వాడిగా వున్న కోరలతో పట్టుకుని నది అడుక్కంటా లాక్కుపోతుంది.







# వాల్రస్

వాల్రస్ కొవ్వు కూరిన పెద్ద తోలు బస్తాలా వుంటుంది.

దీనికి పెళుసుగా వుండే మీసాలు, రెండు పెద్ద దంతాలు వుంటాయి. దీని కాళ్లకి పాదాలుండవు, చేప రెక్కల్లాంటివి వుంటాయి. వాటిని వాల్రస్ తెడ్ల మాదిరీ ఉపయోగిస్తుంది.

యిది నీళ్లల్లోకంటా యీదుకుపోతుంది, మన ఆవులు పచ్చిక బీళ్లల్లో మేసినట్టుగా సముద్రం అడుగున మేస్తుంది. యిది సముద్రం నాచుని తింటుంది. ఆలిచిప్పల లాంటి వాటి కోసం వెతుకుతుంది. కడుపు నిండా తిన్నాక పైకి వస్తుంది. దంతాల్ని తీరంమీదకి మంచు గడ్డలోకి పెట్టుకొని పైకి లేస్తుంది. నీళ్లల్లోనుంచి యివతలకి వచ్చి విశ్రాంతి కోసం రాళ్లమీద వాలుతుంది.



# ధ్రువప్రాంతం ఎలుగుబంటి

ధ్రువప్రాంతం ఎలుగు స్వతహాగా దిమ్మరి. దీని బొచ్చు దళసరిగా వుంటుంది. తడి అవదు. వెచ్చగా వుంటుంది. మంచు యెంత గట్టిగా వున్నా, మంచు తుఫాన్ యెంత ఉద్ధృతంగా వున్నా, నీళ్ల యెంత జివ్వుమనిపించేటట్టు వున్నా దీనికి ఖాతరీ లేదు.

ఆహారం కోసం వెతుక్కుంటూ యిది మంచుమీద, హిమశిలలమీద తిరుగుతూ పోతుంది. వో చేపనో, వాల్రస్‌నో పట్టుకుని గబగబా భోజనం చేసేస్తుంది. అక్కణ్ణే ఆ మంచుమీదనే వెంటనే నిద్రపోతుంది.

నిద్రనుంచి లేచాక మళ్లీ ఆకలి అనిపిస్తుంది. మళ్లీ బయల్దేరుతుంది, పొట్టలో వేసుకోవడానికి యేది దొరుకు తుందా అని చూస్తూ, వాసన చూస్తూ. ధ్రువప్రాంతం ఎలుగు గబగబా పరిగెడుతుంది. వేగంగా లోపలికి ములుగుతుంది, బాగా యీదుతుంది. అందుకని యెక్కువ సేపు తిండిలేక ఆకలికి మాడదు, తిండానికి దేన్నో వొకదాన్ని పట్టుంది.



# ఖడ్గమృగం

ఖడ్గమృగం గుడ్డిగా అడివిలో పడిపోతూ వుంటే చెట్లు కదిలిపోతాయి, వాటి కొమ్మలు ఫెళఫెళ విరిగిపోతాయి. ముళ్ళ గిళ్ళు, చెట్ల మొద్దులు, గట్టి కొమ్మలు దాన్ని యేమీ చెయ్యలేవు. దాని చర్మం కవచంలాగా గట్టిగా వుంటుంది. బల్లెం విసిరినా అది దాన్ని మెత్తగా తగిలి జారిపోతుంది. బాణం విరిగిపోతుంది. తుపాకీ గుండు మాత్రమే దాని చర్మంలో నుంచి దూసుకుపోతుంది.

యీ జంతువుకి ముట్టెమీద నిటారుగా వుండే ఖడ్గంలాంటి కొమ్ము వుంది. దాని కళ్ళు చాలా చిన్నవి. సరిగా కనిపించవు. పిసరు కూడా మంచీ చెడ్డా ఆలోచించకుండా యెవళ్ళు అక్కడ వున్నా వెంటనే మీదకి యెగురుతుంది.

యిది చాలా కోపిష్ఠి జంతువు, యెవర్నీ నమ్మదు.

# ధ్రువప్రాంతం జింక

బాగా ఉత్తరాదిన వేసవి చాలా చాలా తక్కువ వుంటుంది. మిగిలిన కాలం అంతా మంచుగా వుంటుంది. అక్కడ వో గుర్రం గాని ఆవు గాని వుండలేవు. యేమంటే మేత మెయ్యడానికి వో గడ్డి గాదం ధ్రువ శీతంలో దొరకవు కదా. అక్కడ వొక్క ధ్రువప్రాంతం జింక మాత్రమే వుండగలదు. గిట్టలతో మంచుని గీకేసి హిమప్రాంత నాచుని మేస్తుంది.

ధ్రువప్రాంతాల్లో వుండే ప్రజలకి పాలు మాంసం యెలా వస్తాయి? దీని వల్లే.

వాళ్ల స్లెడ్జి బళ్లు లాగేదెవరు? యిదే.

యీ జింక లేకపోతే ధ్రువప్రాంతాల్లో జనం వుండలేరు.



# బాడ్జర్

వసంతరుతువు వచ్చి మంచు కరిగిపోగానే బాడ్జర్ యిమ్ముగా పొడిగా వున్న తన కలుగునుంచి యివతలకి వస్తుంది. యింకా దానికి నిద్రమగత వదల్లేదు. అందుకని చూపు సరిగా ఆనదు. బొచ్చు రేగిపోయి వుంటుంది. ఎలుగుబంటిలాగా అదీ శీతకట్టు అంతా నిద్రపోతూనే వుంది. దాని వొంటిమీద బొచ్చు మేటకట్టింది. బద్ధకం తీరడానికి వొళ్ళు విరుచుకుని ఆవలిస్తుంది. యిప్పుడు అది వొళ్ళు విరుచుకుని, సాఫీ అవుతుంది.

అది కప్పల్ని వేటాడి, చెట్ల వేళ్ల కింద వుండే పురుగుల కోసం వెతుకుతుంది. బాగా తిని తాగేక మళ్లీ కలుగులోకి పోతుంది.





# ఉడుత

ఉడుతకి చెట్లకాయల బదులు పుట్టగొడుగులు తినడం రుచిగా వుంటుంది. ఉడుతకి యెప్పుడన్నా తినాలనిపిస్తే చెట్ల కొమ్మలమీదనుంచి నేలమీదకి దిగుతుంది.

ఉడుతమ్మా, మంచి పుట్టగొడుగు యేదో, చెడ్డది యేదో చెప్పగలవు కదా? సరే గాని, అందంగా తెల్లని మచ్చలతో వున్న యెర్ర పుట్టగొడుగుల్ని మాత్రం తినకు. ఫ్లై అగారిక్ అని దానికి పేరు. అది చాలా విషపూరితంగా వుంటుంది.



# కొంగ

కొంగ బాడవల్లో చిత్తడి దిబ్బమీద కునుకు తీస్తుంది. నిద్రలేచాక ముక్కుతో యీకల్ని సాపు చేసుకుంటుంది. గట్టిగా 'క్రు' 'క్రు' అని అరుస్తూ వుంటుంది.

బఠానీ గింజలు బాగా ముదిరిన చోటుకి యెగిరిపోయి కాసిని గింజల్ని పొడుచుకు తింటుంది. భలే నాస్తా! ఆ తర్వాత నీళ్లు తాగడానికి నదికి పోతుంది, నీళ్లల్లో ప్రతిబింబం చూసుకుంటుంది. అయ్యో! అందంగా లేదే! వొళ్లంతా బూడిద రంగు, కాళ్లు పొడుగు, మెడ సన్నం. రెక్కలు చాచి కాస్త నాట్యం చేస్తుంది. కాళ్లని నేలమీద తడుతుంది. యిటు తిరిగి, అటు తిరిగి అద్దంలాంటి నీటి ఉపరితలంమీద తన బింబాన్ని చూసుకుంటూ ముక్కుతో రెక్కలు షోకు చేసుకుంటుంది.



# అడివి పంది

గుర్రు గుర్రుమంటూ, బుర్రుమంటూ అడివి పంది అడివిలో పరిగెడుతుంది. ఓక్ చెట్టు కాయలు యేరుకుంటుంది, ముట్టెతో నేల దొలుస్తుంది. వంగిన కోరలతో వేళ్లని పెకలించి ఆహారం చూసుకుంటుంది.

బలంగా, వాడిగా వున్న కోరలతో వో చెట్టుని కొరికేస్తుంది, వో తోడేలుని చంపేస్తుంది. ఎలుగుబంటిక్కూడా అడివి పంది అంటే భయమే.

# లిన్క్స్

లిన్క్స్ అనే యీ అడివి పిల్లి కుక్క అంత పెద్దది. దీని తోక పొట్టిగా వుంటుంది, చెవులపైన బొచ్చు వుంటుంది. దీని జేగురు రంగు బొచ్చుమీద మచ్చలుంటాయి. లిన్క్స్ చీకటి అడివిలో మందమైన కొమ్మమీద దారికి దాపులో పొంచి వుంటుంది. వేట జంతువు యేదన్నా వస్తే యెరమీద ఉరకడానికి సిద్ధంగా వుంటుంది.



# ఎలుగుబంటి

ఎలుగుబంటికి తీపి పదార్థాలంటే యిష్టం. రాస్ప్‌బెర్రీలు తింటోంది, యిదిగో! లొట్టలు వేస్తుంది, పెదాలు నాక్కుంటుంది, సంతోషంతో కూ అంటుంది. బెర్రీలని వొక్కొక్కటీ యేరుకోదు, మొత్తం దుబ్బు దుబ్బంతా పీకేస్తుంది.

అబ్బ, నీకు దురాశ యెక్కువ ఎలుగూ! తిండిపోతువి, నువ్వు!

తెగ తిని కడుపు నొప్పి తెచ్చుకునేవు జాగ్రత్త!





# గుంటనక్క

శీతాకాలంలో గుంటనక్క పొలాలమీద వుండే చుంచుల్ని వేటాడుతుంది. బాగా పొలంమీద దూరంలో కంటా పరకాయించి చూడ్డానికి చెట్టు మొద్దుమీదకి యెక్కుతుంది; మంచు కింద వో చుంచు పిసరు అలికిడి చేస్తుందేమో, కిసక్కుమంటుందేమో అని చెవులు రిక్కించి వింటుంది.

యేదన్నా వినిపించినా, కనిపించినా దూసుకుంటూ అటు వేపు పోతుంది. ఆఁ, దొరికింది యీ ఎఱ్ర బొచ్చు వేట జంతువుకి వో చుంచు.

# కుందేలు

కుందేలు బొచ్చు చర్మం వెచ్చగా వుంటుంది, తెల్లగా వుంటుంది. చలినుంచీ, వేటగాడి బారినుంచీ దాన్ని రక్షిస్తుంది. మంచులో వుంటే దాన్ని యెక్కడ వుందో చూడలేం, యేదీ యెక్కడుండీ అని తెలుసుకునే లోపలే ఉడాయిం చేస్తుంది.

శీతాకాలంలో దుబ్బు మొక్కల పట్టాలని వొలుచుకు తింటుంది. వెచ్చని వేసవి కాలం కోసం చూస్తుంది. వేసవి కాలంలో తిండికి కొరతే లేదు. తియ్యటి క్లోవర్ గడ్డి, తిమోతి గరిక, లెక్క లేనన్ని తేనె వూరే పువ్వులు వుంటాయి.

అంచేత, మా పెరటి తోటకి దయ చెయ్యకు, మా కారట్లనీ, కేబేజీలని కొరక్కు.





# గుడ్లగూబ

గుడ్లగూబ యీకలు మెత్తగా వుంటాయి. దీని రెక్కలు చప్పుడే చెయ్యవు. దీనికి వొంగి వుండే వాడి గోళ్లు వుంటాయి. వో ఉడుతో, చుంచో, నిద్రపోయే పక్షో దీనికి పట్టుబడ్డాయో యిక అంతే సంగతులు, బయట పడలేవు. గుడ్లగూబ రాత్రిళ్లే వేటాడుతుంది. పగలు నిద్రపోతుంది.

చిన్న చిన్న పిట్టలు అడివిలో కొమ్మలమీద సరన దూసుకుపోతూ వుంటాయి. వున్నట్టుండి వాటికి గుడ్లగూబ కనిపిస్తుంది. "రండి, రండి అంతా! గాగిల్స్ పెట్టుకున్న రాత్రి దొంగ అదుగో అక్కడ" అని అరుచుకుంటాయి.

# ముళ్లపంది

అడివిలో పుట్టగొడుగుల్ని యేరే పిల్లలకి వో పొదకింద ముళ్లపంది కనిపించింది. అది బెదిరి బంతిలాగా ముడుచుకు పోయింది. దాని ముళ్ళు గుచ్చుకుంటాయి, అందుకని పిల్లలు వొట్టి చేతులతో దాన్ని తాకలేకబోయేరు. అప్పుడు వాళ్లు వో టోపీలోకి దాన్ని దొర్లించేరు. యింటికి తీసుకుపోయేరు. వంటింట్లో నేలమీద పెట్టి కంచంలో పాలు పోసి దాని ముందు వుంచేరు.

ముళ్లపంది బంతిలా చుట్టుకు పోయింది, కదల్లేదు.

ఓ గంటో గంటన్నరో అలానే వుండిపోయింది.

ఆఖరికి నల్లని ముక్కు సూదుల్లోనుంచి యివతలకి వచ్చి కదిలింది.

మ్... మ్... వాసన బాగుంది. అది చాచుకుని పాలు చప్పరించింది. కడుపు నిండా తాగేక మళ్లీ ముడుచుకు పోయింది.

యీ లోపున పిల్లలు వేరే యేదో ధ్యాసలో పడిపోయేరు. ముళ్లపందికి కాపలా యెవరూ లేకపోవడంతో మళ్లీ అడివిలోకి పారిపోయింది.





# ఆడ్డర్

ఎండ బాగా వుంది. వేడిగా వుంది. ఆడ్డర్ తడి వేళ్ల కిందనుంచి, చల్లని నాచు కిందనుంచి వెచ్చగా వుండే చెట్టు మొద్దుమీదకి పాకి వచ్చింది. యీ పాముకి విషపూరితమైన కోరలున్నాయి, వొక్క సారి కరిచి తన యెరని యిది చంపేస్తుంది. ఆ చచ్చిన దాన్ని కబళిస్తుంది.

పిల్లలూ, అడివిలోకి దిస కాళ్లతో వెళ్లకండి. యే ఆడ్డర్ పామేనా కరవవచ్చు. చాలా జబ్బు చేసి యెంతో కాలం మంచం యెక్కాల్సివస్తుంది.



# వడ్రంగిపిట్ట

అడివిలో యెవరా తప్పెట వాయిస్తున్నది? తప్పెట వాయిద్యగాళ్లెవరై వుంటారు? యింకెవరు చూడండి. రంగు రంగుల యీకలతో, యెర్రని తురాయితో వుందే, అదే, వడ్రంగిపిట్ట. పైన్ చెట్టుమీద కనిపిస్తోందా? చెట్టుమీద గెంతుతోంది. గోళ్లతో బెరడు పట్టుకుని తోకమీద ఆనుకుంటుంది. కొండమీద పైకి గెంతుతుంది. బెరడు కింద దానికి వో పురుగు కనిపించింది. టపటప కొట్టుకుంటూ పోతోంది. పురుగుని పట్టుకుంటుంది, మింగుతుంది. యింకా ముందుకు పోతుంది మరో సారి అక్కడ పొడుస్తుంది, మరో చెట్టుమీదకి టపటప కొట్టుకుంటూ పోతుంది.

# అడివికోడి

యిది నిజంగా అందమైన పక్షి. నిగనిగలాడే యెర్ర కనుబొమల్తో మొత్తం నల్లగా వుంటుంది. దీని పొట్టి కాళ్లకి యీకలు గుబురుగా వుంటాయి, కాళ్లని వెచ్చగా వుంచుకోవడం కోసం దూది బూట్లు తొడుక్కున్నట్టు.

శీతాకాలంలో అడివికోడి బర్చి చెట్టుమీద కూర్చుని పూల గుత్తుల్ని పొడుస్తూ వుంటుంది. నిద్రపోయే వేళ అయేటప్పటికి వొక్క ఉదుట్న కిందికి దిగి తల మంచులో దూర్చి రెండు సార్లు చుట్లు తిప్పి తనకి సరిపడా చిన్న కలుగు చేసుకుని రాత్రంతా నిద్రపోతుంది. వసంతరుతువులో అడివికోళ్లు జత కూడడానికి అడివిలో గుబుర్లూ గిబుర్లూ లేని చోటుల్లో చేరతాయి. అవి వొక దానిమీదకి వొకటి యెగురుతాయి, పోట్లాడుకుంటాయి, తెగ పాటలు పాడుకుంటాయి.



# తోడేలు

ప్రమాదం! ప్రమాదం! అందరికీ ప్రమాదం. మేకలు, గొర్రెలు పందులు, దూడలు, ఆవులు, గుర్రం పిల్లలు, గుర్రాలూ జాగ్రత్త!

తోడేలు వేటకి వచ్చింది.

కోపంతో భయంతో వూర కుక్కలు మొరుగుతున్నాయి.

పొలం కాపలా మనిషి తుపాకీలో తూటాలు పెడుతున్నాడు.

యిప్పుడు ప్రమాదంలో పడింది తోడేలేగా మరి.





# కుక్క

దీని చర్మం మందంగా, వెచ్చగా వుంటుంది. అంచేత అది ఆరుబయటే వుంటుంది, శీతాకాలం గానీ, వేసవి కాలం గానీ. దాని గూట్లో పొయ్యిల్లేవు. యేదో గడ్డి పరుపు మాత్రం వుంటుంది. కాని చలిగా వుండదు. యిది సమష్టి క్షేత్రం కాపలా కుక్క. దొంగలెవరూ చొరబడకుండా చూడడం దాని పని. రైతులకి అదంటే యెంతో యిష్టం. దానికి మంచి తిండి మెక్కబెడతారు.

# పిల్లి

మంచి పిల్లి అల్మారాలో యెలకని పట్టుకుంది. అందుకు కానుకగా దానికి యజమానురాలు మీగడ పెట్టింది. సంతోషంతో గురపెడుతూ చిన్న తివాసీమీద కూర్చుంది. చిన్న పిల్లికి అలా కూర్చుని గురపెట్టడం సంతోషంగా లేదు. దాంతో అది మెలి తిరిగిపోయి తన తోకని కొరకబోతూ, హుస్సని అంటూ, వూహా శత్రువుకేసి గుడ్లు మిటకరించి చూస్తూ కాలు దువ్వుతోంది.





# చెవులపిల్లి

కవల పిల్లల్ని పెట్టుకుని కూర్చుంది తల్లి చెవులపిల్లి. వాటికి పొడుగాటి చెవులున్నాయి, కత్తిరించిన బొచ్చు తోకలున్నాయి, గుండ్రని కళ్ళున్నాయి. అవి తల్లిలాగానే గడ్డి మేస్తున్నాయి. అవి అచ్చం తల్లిలాగానే వున్నాయి. గడ్డి పరకని కొరికే ఆ బుజ్జి చెవుల పిల్లని చూడండి. దాని ముట్టె అంతా పనిలోనే వుంది. ముక్కు కదిలిస్తోంది. గడ్డి పరక మొత్తం నోట్లోకి పోతుంది. దాన్ని పూర్తిచేశాక మరో దాన్ని మొదలుపెడుతుంది. వెళ్లి వాటికి చెరి వొక కారట్‌నీ, కాబేజీ ఆకునీ, రొట్టె పెచ్చునీ తెచ్చి యిస్తాను. తింటాయి.



# పంది

ఆహాఁ, యీ అందం చూడండి! మడ్డి పంది. బురదలో పొర్లుతుంది. కుంటలో దొర్లుతుంది.

"మంచి పిల్లలా వుండమ్మా, నదికి వెళ్లి ముక్కుమీదా పక్కల్నా వున్న బురద కడిగేసుకుని రా మరి! యేం వెళ్లవూ? అయితే వెళ్లి పందుల కొట్టంలోకి పో, అక్కడ బాగా రుద్దుతారు పువ్వులా తయారవుతావు."

"గుర్... గుర్! వుహుఁ, నేను పువ్వులా వుండను."



# ఒంటె

ఒంటె మూపురంమీద తట్టెడు తట్టెడు బరువున్న మూటలు మోస్తోంది. వీళ్లమీద చాలా దూరం మోసుకు పోతూ వుంటుంది. ఆఖరికి యింటికి తీసుకువస్తారు. అబ్బ, చచ్చేటట్టు అలిసిపోయింది, యెంత చిక్కిపోయింది. కాళ్లు బార చాచుకుని విశ్రాంతి తీసుకుంటుంది. మెల్లిగా పచ్చ గడ్డినీ, యెండు గడ్డినీ కొరికి తింటోంది. జాగ్రత్తుస్మా, దానికి చిరాకు తెప్పించేరు. మీమీద దానికి కోపం వస్తుంది, ఉమ్మేస్తుంది.





# ఆవు

పచ్చిక బీట్లో ఆవు నుంచుంది. నెమరేసుకుంటూ వుంది. దానికి వొంపు తిరిగిన కొమ్ములున్నాయి. డొక్కలు పెద్దవి. పొదుగు పాలతో నిండుగా వుంది. తోకతో యీగలు తోలుకుంటోంది.

"చెప్పు, నీకు తినడానికి యేం కావాలి? కల్తీ లేని పచ్చ గడ్డి కావాలా, చక్కటి పువ్వులు కావాలా? డైసీ పువ్వు కారన్‌ఫ్లవర్, లేకపోతే 'నన్ను మర్చిపోకు' అనే పువ్వు, యెర్రటి పువ్వు, నీల గంట పువ్వు యేది కావాలి? నువ్వు భేషైన వాటిని తినాలి, నీ పాలు తియ్యగా వుండాలి. పాలు పితకడానికి అమ్మాయి వస్తుంది. కడవనిండా కడివెడు తియ్యని పాలు యిస్తావా?"



# బాతు

రోజంతా చెరువులో బాతు మునుగుతూ, యీదుతూ వుంటుంది. ముక్కుతో పొడుచుకుంటూ యీకల్ని సాపు చేసుకుంటూనే వుంటుంది. ఆగి ఆగి నీళ్లల్లో తనని తను చూసుకుంటుంది, అక్వాక్, అక్వాక్ అంటూ వుంటుంది. "నేను అందంగా లేనా? అక్వాక్!"





# కోడిపెట్ట

కోడిపెట్ట పిల్లలతో పెరట్లో పచార్లు చేస్తోంది. హఠాత్తుగా వాన అందుకుంది. గబగబా అది నేలమీద కూచుని యీకల్ని లేపి, కొక్కొ అంది. పిల్లల్ని వచ్చి దాంకోమని చెప్పడం అన్న మాట అది. అవి గబగబా పరిగెత్తి వచ్చి తల్లి రెక్కల కింద పోగయేయి. అక్కడ అన్నిటికీ చోటు చాలదు. వో కోడి పిల్ల కాలు యివతలే వుంది, యింకో దాని తల అవతల వుంది.

తల్లి పిలవగానే రెండు కొంటె పిల్లలు రాలేదు. అవి వానలో తడిసి వొణికి పోతూ వున్నాయి. యెమిటయ్యా తలమీద మోదుతూ పడుతోంది అనుకుంటున్నాయి.

# గుర్రం

యిది పడుచు గుర్రం. పచ్చిక బీళ్లమీద స్వేచ్ఛగా దౌడు తీస్తుంది. సంతోషంగా సకిలిస్తుంది. నేలమీద గిట్టలతో కొడుతుంది. యింకా దీనికి జీను పడలేదు. దీన్ని యింకా బండికి కట్టలేదు. దీని వాసం సమస్తి క్షేత్రంలో. దీన్ని



అక్కడ పెంచుతున్నారు. పందేల్లో దీనిమీద స్వారీచేసే జాకీ దీని భావి యజమాని. పడుచు గుర్రందే అదృష్టం. వో బండి లాగక్కర్లేదు. యజమానిని తీసుకు వెడుతుం దంతే.



# గొర్రె

యిది మామూలు గొర్రె కాదు, చాలా మంచి జాతిది. దీని ఉన్ని మందంగా, చక్కగా వుంటుంది. గ్లవ్స్ అల్లుకోవడానికి బాగుంటుంది. స్వెట్టర్లకీ, మేజోళ్లకీ బాగుంటుంది. మన బట్టలన్నిట్నీ యీ ఉన్నితో కుట్టించుకోవచ్చు, ఫెల్ట్‌బూట్లని కూడా. యివన్నీ యెంతో వెచ్చదనం యిస్తాయి.

# ఆడమేక

యిది వూళ్లో వీధుల్లో వరిగెడుతోంది. భోజనం తయారుగా వుందనీ, యజమానురాలు తన కోసం చూస్తూ వుందనీ దానికి తెలుసు. యింటావిడ సరిగ్గా చూడకపోతే ఆడమేక తన వొప్పు తను చూసుకుంటుంది. వంటింట్లో వున్న చీపురు నములుతుంది. రొట్టె ముక్కని కొరుకుతుంది. పెరట్లో మొక్కల్ని కొరుకుతుంది. లేకపోతే తోటలో వున్న ఆపిల్ చెట్టు బెరడు పీకుతుంది. యెన్ని కొంటె పనులు చేస్తుందో. అయితేనేం, చక్కటి పాలని యిస్తుంది. నిజం చెప్పద్దూ ఆవు పాలకంటే నాకు దీని పాలే యిష్టం.





# టర్కీ కోడి

టర్కీ కోడి పెరట్లో రాజసంగా నడుస్తుంది. యెంత దర్పం! ప్రతి వాళ్లకేసి కోపంగా చూస్తుంది. రెక్కల్ని నేలమీద యీడ్చుకుంటూ వెడుతుంది, తోకని విప్పుతుంది. పిల్లలు దీన్ని వాకో అప్పుడు ఉడికిస్తారు. అప్పుడు యింకా దర్పం వెలిగిస్తూ అర్థం పర్థం లేకుండా కూతలు కూస్తుంది.

# పెద్దబాతు

తన యీతాలు తను యీదింది. యిక వాస్తా పడాలి.

బాతూ, బాతూ మంచిగ వుండేం
పెడతా నీకూ చక్కని తిండేం
మెత్తని తెల్లని రొట్టెలు తడవకు
నన్నిక ముట్టెతో ఎన్నడు పొడవకు!



# గాడిద

గాడిదని హుషారుగా వుంచాలని చెప్పి దాన్ని బర్డక్ మొక్కల దగ్గర గుంజకి కట్టేరు. ఆ ఆకులే దాని కిష్టమైన ఆహారం. అన్ని ఆకుల్నీ తినేసింది, కాని మంచి ఆకులు దానికి అందుబాటులోకి రాలేదు, దానికి కట్టిన తాడు చిన్నది.

అది పరమ దరిద్రంగా ఓండ్ర పెట్టడం మొదలుపెట్టింది. ఐదు కిలోమీటర్ల దూరం వినిపిస్తుందా అరుపు. తన గాడిద పిల్లని దగ్గరికి తీసుకురమ్మని యజమానిని పిలుస్తోంది.



## విషయసూచిక





**Е. Чарушин**
**МОЯ ПЕРВАЯ ЗООЛОГИЯ**
***На языке телугу***

**Y. Charushin**
**MY ANIMAL BOOK**
***In Telugu***



సోవియట్ యూనియన్‌లో ముద్రించబడింది

ISBN 5-05-003167-2

"నా చిన్నతనం అంతా జంతు ప్రపంచంలో గడిపాను అనే చెప్పాలి. నా బాల్య అనుభవాలు నామీద బలమైన ముద్రవేశాయి. అందుకనే నేను రచయితనీ, చిత్రకారుణ్ణీ కాగలిగేను."

అని యెవ్‌గెనీ చరూషిన్ తన గురించి రాసుకున్నారు. ఆయన ప్రసిద్ధ చిత్రకారుడు. జంతువుల గురించి చిన్న పిల్లలకి యెన్నో పుస్తకాలు రాశారు.

ఆయన కొడుక్కి కూడా తండ్రికి లాగానే జంతువులు ఆదర పాత్రం అయేయి. ఆయన కొడుకు నికీత కూడా చిత్రకారుడయేడు. కొన్ని పుస్తకాలు వాళ్లిద్దరూ కలిపి కూర్చారు. "జంతు ప్రపంచం" ఆ రకంగా నిర్మించారు. తండ్రి విషయం సమకూరిస్తే, కొడుకు చిత్రాలు గీశారు.





"రాదుగ" ప్రచురణాలయం·మాస్కో